క. ఆయంబు వ్యయము మించిన
శ్రీయును సమమైన దళము చెడకుండు వ్యయం
బాయంబు మించెనేనియుఁ
బాయదు పేదఱిక మెన్నిభంగుల సుమతీ. ౨౮

క. గుప్తము సేయుము తంత్రము
సప్తోపాయములనైన శత్రుల గెలుమీ
సప్తవ్యసనము లుడిగియు
నాప్తుల రక్షింపు చాలు నంతియె సుమతీ. ౨౯

క. రాఁగలభాగ్యము వచ్చినఁ
దాఁ గుడువక దాన మిడక దాఁచుఁగ నేలా
పోఁగాలంబులు వచ్చిన
మాఁగిన పండ్లూడినట్లు మహిలో సుమతీ. ౩౦

క. గాడిద మదకరి యగునే
బూడిద కర్పూరరజము పోలిక యగునే
మోడు విమానం బగునే
మూఢుఁడు గుణియగునె తలఁప మున్నుగ సుమతీ ౩౧

క. ఇచ్చినదినముల దాఁకనె
లచ్చికి నెపఁ బాయరాను లజ్జయు వలెనే
యిచ్చినదినములు తీరిన
నిచ్చఁ దనుం బాసి లచ్చి యేఁగుర సుమతీ. ౩౨

క. తనయుఁడు తండ్రికి బాలుఁడు
ఘనుఁ డాతఁడు తండ్రి లావుగలనాఁ డెల్లన్
జనకుని లావుడిగిన మఱి
తనయునికిని దండ్రి శిశువు ధరలో సుమతీ. ౩౩

క. రానిది కోరిన వచ్చునె
రానున్నది కోరకున్న రాకేలుండున్
దానెంత తమకపడినను
గానున్నది గాకపోదు గదరా సుమతీ. ౩౪

క. అంజనసూనుఁడు దెచ్చిన
సంజీవికి సాటివచ్చు సకలార్థులకున్
రంజిల్ల నపుడువార్చిన
గంజిసుమీ ప్రాణరక్ష గదరా సుమతీ. ౩౫

క. దారిద్ర్యముకంటె మహా
దారుణ మగు పాతకములు దలఁప గలవే
చేరుదురు మృతిని నలువురుఁ
జేరనొల్లరు దరిద్రు నొకఁడు సిద్ధము సుమతీ. ౩౬

క. అలుకునెడ రొంపిఁ జల్లుట
కొలు చొల్లమిగాదు మిగులఁ గూర్చుటకొఱకే
వలయునెడ నర్థమిచ్చుట
వెలయఁగ నభివృద్ధికొఱకె వినరా సుమతీ. ౩౭

క. ఏడెన్నడుఁగఁగవలయును
నేడెన్నఁడు విడువవలద దేడున్ వినుమీ
యేడున్ మనమున నిలుపుము
యేడెన్నఁడు విశ్వసింప కెన్నఁగ సుమతీ. ౩౮

క. అనఘా విను ముద్యోగికి
ధనమొండెను గీర్తి యొండె ధన్యత యొండెం
బొనరంగ నిరుద్యోగికి
ధనకీర్తులు రెండు లేవు తథ్యము సుమతీ. ౩౯

క. మదిఁ బొడమిన దుఃఖమునకుఁ
జను వొండెదుఁ బ్రాయ మొండె సజ్జనగోష్ఠిం
బొదలుచు నొకపద మొండెను
బద నెఱిఁగిన చెల్మియొండెఁ బ్రాణము సుమతీ. ౪౦

క. ఆసించినవ్వా డిచ్చిన
వీసము పదివేలుపోలు వెయివేలై నన్
వీసముగఁ జూజు మనుజుం
డాసల నడిమూడ నీయ నర్థికి సుమతీ. ౪౧

క. ఒఱగొండ్ల పూరనుండకు
మఱగలచుట్టఁబు కలిమి కాసింపకు మిం
చెఱుఁగని హీనునిఁ గొల్వకు
మఱవక దుర్జనుల గోష్ఠి మానుమి సుమతీ. ౪౨

క. భువి నీవి కొంచె మైనను
గువలయపతి సుగుణియైనఁ గొల్వఁగవచ్చున్
యువరాజ్యపట్టమిచ్చిన
నవివేకిని గొల్చుటెల్ల నధమము సుమతీ. ౪౩

క. త్రాసును ధరలోఁ బడిచెడు
వీసనబడి యొక్కరూపు వివరింపంగా
వీసంబైనను దిరముగ
నోసరముగ నొక్కవంక నొదుఁగుర సుమతీ. ౪౪

క. వలపని పల్కును మదిలోఁ
గలయని సతిపొందు రాజుగానని కొలువుం
బిలువని పేరంటంబును
దలఁపని చెలిమియును నెంచఁ దగదుర సుమతీ. ౪౫

క. ఘన మెఱుఁగనట్టి కోడలు
వినయము లేనట్టి సుతుఁడు వెఱవని యనుజుల్
అనుకూల గానిభార్యయు
మనుజునకును మంకు లేనిమరణము సుమతీ. ౪౬

క. తఱిమినఁ బాఱనిగుఱ్ఱముఁ
దర మెఱుఁగని రాజుకొలువు తరుణులయెడలం
దరితీపు సేయు మోహము
గరగరగా విడువవలయుఁ గదరా సుమతీ. ౪౭

క. సుంకరికి బొంకు వలయును
అంకనకును దిరుగవలయు నవనీస్థలిలో
శంకుడిగి మిగుల ముదిసిన
వంకాయకుఁ జింతకండు వలెరా సుమతీ. ౪౮

క. సిరి తనకు వలచి వచ్చిన
సిరికిం దగు చిహ్నలెల్లఁ జేయఁగవలదా
సిరిగూర్చి ప్రాఁకఁ దలఁచిన
సిరికడపటఁ జేరు నదియు సిద్ధము సుమతీ. ౯౯

క. మొగసాల నొంటి నుండకు
పగచాటి జయించు దాఁకఁ బదరకు మదిలోఁ
దెగఁబొఱువాని నమ్మకు
పగగొనునాచోట నిల్వ వలదుర సుమతీ. ౧౦౦

ఇవి, అంద్రంగి గ్రామనివాసులు బొడ్డపాటి లక్ష్మీపతిగారిచే క్రీ శ. ౧౮౬౩ సంవత్సరమున వ్రాసికొనఁబడిన తాళపత్ర సుమతిశతకపద్యము లనుండి శ్రీ దువ్వూరి బావన్నగారెత్తి వ్రాసి పంపినవి.

కొన్ని పద్యము లింకను గలవుగాని మృదువుతప్పియున్నవి. ప్రకటించిన వానిలోను గొన్ని సందేహములుగా నున్నవి.

అచ్చుపడిన పుస్తకములలో నివి కనఁబడవు.

ఖండించుచు వాస్తవమును లోకమునకుఁ దెల్పుపత్రిక. ఇతరపత్రికలలో వలెనే యింకను విదేశరాజ్యవ్యాపారవిషయములు, యుద్ధవార్తలు లోకవృత్తములు నుండును ముఖ్యముగా మాపరిషత్తు కొనియాడు గ్రాంధికభాష నాదరించుచున్నది. ఇదియే ముఖ్యముగా జనులకుఁ గావలసినవాణి. ఈపత్రికాపోషకులు శ్రీపిఠాపురముమహారాజావారు, పత్రికాప్రకాశకులు ప్రసిద్ధభాషావేత్తలు తాపీ ధర్మారావునాయఁడు బి. ఏ. గారు.

విడిసంచిక రు 0-0-3 !! పౌరుఁగూరువారికి నెలకు రు 1 చందా. ఆఱునెలలకు రు 5-8-0. లోకోపకారమునకై వెలువడు పత్రికను లోకమే యభివృద్ధిచేసికొనుఁగాక. దానికై పరమేశ్వరుఁడు సాయపడి లోకము నభివృద్ధికిఁ దెచ్చుంగాక.

జనవాణికార్యాలయము చెన్నపురి మౌంటురోడ్డు 2/16 గృహమున స్థాపింపఁబడినది. ప్రతిపట్టణమునను జిల్లరగాఁ బత్రికలు విక్రయింతురు.

# సుపథము.

— సోంపల్లె కృష్ణమూర్తిగారు, అష్టావధాని, కొక్కంటి. —

క. మాకందము లేకవులకు
మాకందము లవియె వాగ్రమాకందములై
మీకందములగు, రమ్మసు
మీ! కందము, మిత్ర! వాని మృదుమధురగతిఁ॥

క. తనబలము నెదిరి బలమును
మనమునఁ దలపోసి, వలయు మాటలఁ గార్యం
బును సార్థకపఱచెను స
జ్జనుఁడే జనుఁడౌచుఁ; గానిజనుఁడు జనుండే.

క. విద్దెను నేరిచి మేలగు
బుద్ధికలిగి పెద్దవారి పోకడఁ గనుచున్
హద్దుగఁ బ్రదికెడువాఁడే,
తద్దయుఁ గీర్తినిఁ గాంచుఁ; దదితరుఁ డఘుఁడౌ. 3

క. కోటికి మించిన కవు లిలఁ
బాటింపఁగ వెలసినం గృపామతి సువచో
ధాటి శమమ్మును గలిగిన
మేటియె కవివర్యుఁ డతఁడె మే లొంకు నెటన్. ౪

క. వార్తాపత్రిక లెన్నియొ?
వర్తించుట మేలెకాని, బహుభంగుల దు
ర్వర్తనము పక్షపాతము
గుర్తెఱిఁగిన నపుడె, మూలఁ గూలుట నిజమౌ. ౫

క. స్త్రీలు, స్వతంత్రతఁ గని మిడి
మేలపుగతిఁ బతులఁ దెగడి, మిడుకుట మేలా?
బాలావనలీలాసుఖ
హేలామతి భర్తృభక్తి నెసఁగుట పొసఁగున్. ౬

క. ధనమే ముఖ్యంబగు సా
ధన మిహపరములకటంచుఁ దద్జ్ఞుల సద్బో
ధనములఁ దెగటార్చిన, నిం
ధనములె గతియౌను; జీవధనమున కెల్లన్. ౭

క. ఒప్పని తప్పని తెలియక
చెప్పెడు మాటలను నమ్మి చేటగుపనులం
దప్పక సల్పిన నాఁడే,
చిప్పెఁడుగంజియును లేక చెడు నెవ్వాఁడున్. ౮

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౬. { ఈశ్వరనామసంవత్సరము. మార్గశిరపుష్యమాసములు. } సంచిక ౫.

---

## మనవి.

మహాశయులార !

మీయభిమానమున నిట్లు పరిషత్పత్రిక యవిచ్ఛిన్నముగా నడచుచున్నది. ఎప్పటి యభిమానము నిఁక ముందును గనఁబఱుపఁ వేఁడుచున్నారము. లోకమున భాష యతివ్యాప్తిని గాంచుచున్న సంగతి యొకరి కొకరిపుడు చెప్పనక్కఱలేదు. భాషాభిమానులు పండితులు కవులు పలువురు బైలువెడలి పేర్వోలసి యనేకవిధముల నాంధ్రమును వృద్ధి చేయుచున్నారు, గాని, యీవృద్ధి దృఢతనొందునా ? "పొడవెనుగుఁబడుటకై" యన్నట్లు గాదుగద! అట్లు శంకించుటకు మాకనేక కారణములు కనఁబడుచున్నవి. కొందఱు కవి యట్లు కనఁబడవు. దృఢత భాషకు వాటిల్లఁ జేయవలయు నన్నఁ బూర్వపద్ధతియే మంచిది. పూర్వపద్ధతి యంధపద్ధతి యని కొందఱనుచున్నారు. అది ముందుదృష్టి లేక యనుమాట. ఇప్పటిరచనలే యాంధ్రపరంపరలోని వనిమానమ్మకము. ఒక్క నియమము నొక్క మార్గమును లేనిపద్ధతులను బ్రతిపండితుఁడు నాదరించుట శోచ్యము. వారికిఁ దోఁచు యుక్తులు వారు చెప్పుదురు, గాని భాషకు దార్ఢ్యము కలుగవలయుననినఁ బూర్వపద్ధతియే మంచిది. నవీనపద్ధతి యంత మంచిది గాదు. తేలిక పనులు చేయుట తేలికయనుకొనువారి కిష్టము శ్రమపడి

యభ్యసించిన విద్యకును స్వశ్రమంబుగ సంపాదించిన విద్యకును భేదము లేదా! నియమరహితమున క్లిష్ట మార్గ మని చెప్ప వలను లేదు. నియమసహిత మెన్ని తావులనో క్లిష్టవిధమున నేయుండును. సర్వజనవిదితమగు భాష కావలయు ననినఁ బూర్వగ్రంథములనే చదువవలయును. ఇప్పుడిపుడు తొల్లింటి గ్రంథములనుఁ జాలమంది యాదరింపకున్నారు. కారణము తొల్లింటివలె గ్రంథములు సులభ సాధ్యములు కాకపోవుట చేతనా? సులభసాధ్యములగు గ్రంథములలోఁ దప్పులు మెండుగా నున్నవని మన వారెఱుఁగకపోరు. ఎక్కువవెలలు పెట్టి వర్తకులు ధనార్జనము చేయఁ జూచుట దూరాలోచనము లకయే. మున్ను ౧ రూపాయకువచ్చు భాగవత మిప్పుడు ౭ రూపాయలైనదన్న మాట వాస్తవమే. తప్పు లున్నను సవరించుకొనఁ గలవా రిప్పుడు లేరు కావున శుద్ధప్రతులను బ్రకటించుట యవసరమే. ఇట్టి వెన్నియో యోజించి మేము పరిషత్తులోఁ బ్రకటించు గ్రంథముల కన్నిటికిఁ దక్కువమూల్యములను నిర్ణయించి యున్నారము. సాధ్యమైనంతవఱకుఁ బరిశుద్ధముగా నుండఁజూచుచున్నారము. ఇట్టి రెండులాభములుగల మాగ్రంథములు విస్తారవ్యాప్తిలోనికిఁ దెచ్చుటకుఁబరిషత్సభ్యులాలోచించి1938సంవత్సరాది మొదలు బహుధాన్యసంవత్సరసంవత్సరాదివఱకుఁ బ్రతిపుస్తకమును సగమువెలకే యిచ్చుటకుఁదీర్మానించినారు. కావునఁబరిషత్తుమీఁదను నిక్కమైన మాతృభాషమీఁదను నభిమానముగలవారు మాయుద్యమమునకుఁదోడ్పడుదురుగాక యని కోరుచున్నారము. దీనికై ముఖ్యమగు నొక పుస్తకములపట్టికను బ్రకటించియున్నారము. దానిని చిత్తగింపఁ గోరుచున్నారము. చందాదారులును దమతమ మిత్రులకీ విషయమును దెలియఁజేసి పరిషత్తునకు సాయపడుదురుగాక.

# విన్నపము.

— జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు-కడః

మహాశయులారా !

ఈశ్వరవత్సరము ఆశ్వయుజకార్తికమాసములలో ౨౩ సంపుటము ౪ వ సంచికగాఁ బ్రకటితం బయిన పరిషత్పత్రికలో శ్రీకొత్తపల్లి సూర్యరావుగారు వేత్తలనుగుఱించి పునఃప్రార్థన మను శీర్షికయందు సంశయములని యీక్రింద వివరింపఁబడిన వానిని సూచించియున్నారు. నేను వ్రాయు విషయము నధిక ప్రసంగముగా భావింపక యిదియు నొకవిధ మగు నభిప్రాయముగాఁ బరికింతు రనియు, నిందలి సత్యాసత్యములను గూర్చి విజ్ఞులు నిర్ణయింతు రనియుఁ దలంచుచున్నాఁడను.

1. 'తుమికీ బాయిల బాయిరే ములికి యందు మ్రింటికిం బోవున౯'- ఈపద్య మెల్లవారును నెఱింగినయదియు.

ఇది "ముండా" భాషయుఁ "బుళింద" భాషయుఁగాదు. ఉర్దూభాషయే. తుమికీ-అనునది'తుముకూ' యని యుండవలయు-'మీకు' అనియర్థము.

'బాయిల బాయిరే' అనునది భాయిరె భాయిరే యని యుండవలయు-ఓసోదరులారా యని భావము. ములికి-అనఁగా-దేశము-రూపాంతరము-మ్లేచ్ఛ-శత్రువులగు యవనులు (మహమ్మదీయులు) చచ్చిస్వర్గమునకుఁ బోవుచు 'ఓసోదరులారా ! ఓసోదరులారా ! మీకుదేశము-(మీకేదేశము)-అని వెఱచి చెప్పుచుండుటఁ గననగు-అచ్చటికిని వెన్నంటుదురేమో యని సంశయించి 'దేశము మీకే సోదరులారా!' యని కేకలను బెట్టుచు వెళ్లుచున్నా రనుభావము కన్పట్టుచున్నది. వైరిధాటి యత్యద్భుతము-

బాయిలె బాయిరే యనునది-క్రమక్రమముగ వ్రాఁతలోనిమార్పుగా నుండనోపు. నోటికొక్కమాట వ్రోటికొక్కపాట యన్నట్లుగ నానోటినుండి యానోటికి నిట్లుమార్పులుగలుగుకొలఁది నిట్టిపదములు మార్పు

చెందుట సహజముకాఁబట్టి తుముకూ (తుముకీ) (తుమ్‌కూ) బాయిల బాయిరే (భాయిరె భాయిరే) ములికి (ముల్కీ) యను మార్పుగా భావింతును. అన్యదేశ్యములు కావున నిట్టిమార్పు సహజమే-విమర్శకుల కెట్లు తోఁచునో? నేను గొందఱ ముసల్మానుపండితుల నడిగితి. వారును నాకిట్లే యర్థము తెల్పినారు.

2. "ఒడయ చిత్తేశ యోనడలింగమూర్తి" ఇందలి చిత్తేశపదమునకు నర్థము సందియము.

ఇట్లే 'దేవచిత్తేశ' యనునదియు-

'నాచిత్తేశుఁడాఁగాక నిద్రితులై పోదురుగాక'వంటి దిదికాదు' అనిరి.

'నాచిత్తేశుఁడాఁగాక' యనుటలోఁ బ్రాణేశుఁడనుభావము. అనఁగా భర్తయనునర్థము స్ఫుటముగఁ గనఁబడుచున్నది. అట్టియర్థము పైపదములలోఁ గనఁబడ దని యూహ్యమై యుండనోపు.

కన్నడదేశమునందును, మధ్వసాంప్రదాయమునందును, 'ప్రాణేశ' అనునదిదేవునకును నుపయోగింతురు. ఇట్లే యిందును, ఒడయ=ప్రభూ, చిత్తేశ=ప్రాణమునకు నధిపతీ! ఓనడలింగమూర్తి=నడచునట్టి లింగాకారము గలవాఁడా; ఓశంకరా! యనుట- చిత్తేశుఁడు=భర్త (పెనిమిటి) మాత్రమేకాఁడు- ప్రాణమునకు నాథుఁడు, అనుభావము-

జీవో దేవ స్సనాతనః- అనుమాట య ట్లుండఁగా మాధ్వులలో 'ప్రాణేశాచార్యులు, ప్రాణేశరావులు- పెక్కురు గలరు- చంద్రభానుచరిత్రము మాధ్వసంప్రదాయములుగల మాధ్వకవికృతము.

శ్రీకాళహస్తిమాహాత్మ్యమునందును కర్ణాటకసంప్రదాయపదములు దొరలినవి. చిత్తేశుఁ డనఁగా చేతస్సున కధిపతి యనుట-దైవపరమున నర్థముఁ జెప్పుట యుక్త మని తోఁచుచున్నది.

బళ్లారిప్రాంతములకు వచ్చి చూచిన స్పష్టము కాఁగలదు. దేవాలయమునఁ బ్రాణేశా యని ప్రార్థించుట చూడవచ్చును.

3. పిడ్పాంక కొమ్మయ శివలీలావిలాసములోని,

'చ. తొలఁగక తాపసుండు శివదో శివదో (శివదో) యటంచుఁ జం
　చలమతిఁ గూయఁగా నతఁడు శంకరలింగ నిషకహాసముల్

బలువిడి విప్పి దండి నిజపాశముల౦ బెడకేలుగాఁగ వ
చ్చలముగఁ గట్టి వెల్పలికిఁ జక్కగ నీడిచితెచ్చె-'

ఇందు "శివదో" యనఁగా నేమి. ప్రార్థనమునం దిట్టి రూపమున్నదా; ఏదేశములోనైన నిట్టి వాడుక కలదా, యతులు ప్రాసములు దిద్దుదురా !'' ఇది సంశయము. నాయూహ:—ఇది ప్రార్థనముకాదు. దో- ఇదో అనుట- ఇందలి సందర్భము—యముఁడు మార్కండేయుని బట్టుకొనిపోవుటకు వచ్చుట. మార్కండేయుఁడు శివాలయంబున శివలింగమును బట్టుకొని కూర్చుండియుండును. అతిభయంకరుం డయి యముఁ డాతాపసుని నెదుర్కొనఁగాఁ దాపసుఁ డనన్యశరణుండై శంకరునింగూర్చి శివ ! దో, శివ ! దో యని యాత్రమున దిక్కు తెలియక (చంచలమతి) పల్కఁగా యముఁడు శివలింగమునం దుంపఁబడిన కరములను బలవంతమున విప్పి తన పాశముచేఁ బెడకేలు (ఱెక్కలు విఱిచి) కట్టి వెల్పలికి నీడిచితెచ్చె- అని యర్థము. దో, అనునది (ఇదిగో) ఇది+ఓ=ఇదో- అని శత్రువును, ప్రాణసంహారణప్రయత్నమునందు యమునిఁ జూపుట-

దో- యనునది తెల్గుదేశము (దత్తమండలముల) లో మిక్కిలి యలవాటుగ నుండుమాట-

ఇదో యనుటకు దో యనుట సహజము. (Behold) వచ్చె శివదో (ఇదో) ఇంక గతియేమి యని చూపుచుఁ బల్కినపల్కుగా నెంచుట లగ్గు. దీన యతిభంగము కలుగఁబోను. అర్థమునకు హాని రాదు. Brown's Dictionary బ్రౌణ్యనిఘంటువున- దో- ఇదో యనుటకు రూపాంతరము- అని వ్రాయఁబడియున్నది. ఇంతకంటె నాకుఁ దోఁచు నభిప్రాయము లేదు. ఇది సరిగానుండు నని తలంతురుగాక !

4. 'కర్తార' శబ్దమును గుఱించి-

కర్తారశబ్దము యయాతిచరిత్ర ననుసరించి యర్థము-హుమాయి యాపుడమిఱేఁడు కులదైవముగా భావింపనగును. మఱొక పర్యాయము దీనిని గుఱించి తెలుపఁబ్రయత్నింతును.

---

కర్తార్ శబ్దమునకు హిందీ, పారశీకనిఘంటువులలో భగవంతుఁడను నర్థమీయఁబడినది. ప. సం.

# రోలంబాష్టకప్రశంస.

వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు- చెన్నపురి.

---

షడ్భాషాకోవిదుఁడై సకలకళాప్రవీణుఁడై పండితరాజబిరుదము తో భూమండలమునఁ బ్రసిద్ధింగాంచిన జగన్నాథకవీంద్రునిచే గీర్వాణ వాణిని రచింపఁబడిన భామినీవిలాస మను రసాలమున కంటుగట్టఁబడిన శ్రీదంటు సుబ్బావధానిగారి యాంధ్రభామినీవిలాసమును, కవితిలక కాంచనపల్లి కనకాంబగారి యింటఁ గవిముఖమున వింటిఁ గంటి నానంద పరవశతను.

నాదఫలకపరివర్తనమున (గ్రామోఫోనుప్లేటు) గాయకశిఖామణి బాణి గోచరమగునట్లు అవధానిగారి యనువాదమునఁ బండితరాజవాణీ ధ్వని విదిత మగుచున్నది. అనువాద మన నిట్లన్యూనాతిరిక్తమై సొంపు గా నుండవలయును గాని కవిహృదయమును గంగపాల్సేయునదిగా నుండరాదు.

అంతఁ గొంతవడి కవధానిగారు, అన్యాపదేశసుందరము లగు కొన్ని సంస్కృతశ్లోకముల మనోహరముగాఁ బఠింప నే వానిం బండితరాజ విరచితములనుగా నెంచి "పండితరాజశ్లోకములు వేమనపద్యములవలె వేనవేలుగాఁ జూపట్టుచున్న వంటి. అది విని కనకాంబగారు మందహాస ముతో "ఈశ్లోకములు వైద్యరాజకృతములు కాని పండితరాజనిర్మితము లు కా వనిరి. అపైని వైద్యరాజుగారు రోలంబాపదేశముతో భక్తవరుని జీవితము నుపదేశించుచుఁ దాము విరచించిన రోలంబాష్టకమును శ్రోత్ర పేయముగా గానమొనర్చిరి.

దాని నాకర్ణించి యీకటికికలినాఁటఁ గూడ నిటులు నీటుగా సం స్కృతమున ననర్గళకవితాధారను బ్రసరింపఁజేయసమర్థులగు నాంధ్రకవి సోదరులువిరాజిల్లుచున్నందులకు సంతస మంది, "ఏకః స్వాదు న భుంజీత" అను న్యాయముచే శ్రీవైద్యరాజ సుబ్బావధానిగాఁచే నిర్మితమైన రోలం

బాష్టకరసాయనమాధుర్యమును పాఠకమహాశయులకు రుచిచూపుతలం
పుతో నీపత్రికారజతపాత్రమున దానిఁ బొందుపఱిచితిని.

శ్లో॥ హృద్యం పండితరాజపద్యలహరీసారం బుధామోదదం
ఆనీతం కవినా మనోహరగిరా దంటూపాఖ్యవంశేందునా
ఆంధ్రాణాం ప్రముదే సుధారససమం గాంభీర్యభావోజ్జ్వలం
వైద్యేంద్రేణ సుభావధానివిదుషా సాహిత్యరాజ్ఞాలినా॥

శ్లో॥ శ్రూయంతా న్నుకవే స్సుభావలలితా రోలంబసంబోధకాః
శ్లోకా స్సాంస్కృతికా స్సుమోపమగుణా స్సుబ్బావధానే రిమే
యో వాచాసమతాం సుధీ రనుగత స్సాహిత్యసృష్టౌ స్వయం
వేగీదేశభవేనపండితవరే ష్వాంధ్రేషు భోః పండితాః॥

ఇట్లు విబుధవిధేయుఁడు,
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

---

## —రోలంబాష్టకమ్—

వైద్యరాజ దంటు సుబ్బావధానిభి ర్విరచితమ్.

శ్లో॥ శ్రీవాణీచరణారవిందమధుప శ్చేతోహరాం ఝుంకృతిః
కీటానాం నికటే కరోతి వితర న్తాదాత్మ్య మీశేచ్ఛయా
తామ్రాక్షా ననునాదయ న్శ్రుతిహితం తామ్రామ్రశాఖాస్థితాన్
కేళీలోలవిఘూర్ణబాలకగణా న్నిద్రాపయ న్లీలయా॥

శ్లో॥ ఓంకారాభ మశేషమంత్రఫలదం బుద్ధేః ప్రబోధం పరం
ఝుంకారం బుధసమ్మతం శ్రుతిహితం యచ్చిత్తవృత్తే ర్లయమ్
కామం సంసృతిదుఃఖభారశమనం కళ్యాణసంవర్ధనం
శ్రీవాణీచరణారవిందమధుపో గాయ త్యజస్రం ముదా॥

శ్లో॥ ఫుల్లాంభోజమరందబిందురశనం హంసై స్సహాలాపనం
తీర్థానాం నికటే సదానివసనం సూర్యాబ్జసంసేవనమ్

నాదోపాసన మన్వహం విహరణం కోకై శ్చకోరై స్సహ
భోరోలంబ తి వాఖిలం శుభకరం ధన్య స్త్వ దన్యో స్తి కః॥

శ్లో॥ అభ్యస్తాఖిలవేదశాస్త్రనిచయాః ఆజన్మశుద్ధా ద్విజాః
నిత్యోపాసితసత్యశౌచకరుణా నిర్లిప్తచిత్తాస్తు యే
త్వద్వృత్తే రనువర్తనేన మునయో జీవంతి తే నిర్భయాః
భోరోలంబకదంబ సత్త్వవివరై ర్మాన్య స్త్వ దన్యోస్తి కః॥

శ్లో॥ పంకే జన్మ సుధాంశువైర మనిశం మధ్యే జడానాం స్థితిః
ఇత్థంభూతకుశేశయేఽమృతసమం గూఢం విలీనం రసమ్
భోరోలంబ వివేక్తు మస్తి కిమహో లోకే పటు స్త్వాం వినా
నీరక్షీరవివేచనం కి మధికం హంసస్య పుష్ట్యై ర్యశః॥

శ్లో॥ లక్ష్మీమందిరనిత్యవాసరసిక స్త్వత్తోఽస్తి కిం భాగ్యవాన్
సారాసారవివేచనేతి కుశల స్త్వత్తోఽస్తి కిం తాత్త్వికః
ఆనందామృతనిత్యపానరసిక స్త్వత్తోఽస్తి కిం యోగిరాట్
భోరోలంబ తవావలంబన మహో నూనం భవే త్తారకమ్॥

శ్లో. దూరం ముంచసి చంపకం తు విరసం భోగం వినా వాసనాం
దూరం ముంచసి కేతకీం సరజసం స్నేహం వినా బాంధవమ్
దూరం ముంచసి కింశుకం కిమరుణం రాగం వినా రంజనం
భోరోలంబ భవద్వివేకగరిమా త్వాలంబనం యోగినామ్॥

శ్లో. కామస్యాపి భవత్కృపావిరహితం కాష్ఠం భవే త్కార్ముకం
దుష్యంతోఽపి భవత్కృపావిరహితః కిం ప్రాప్నుయా ద్వల్లభామ్
ఆచార్యోఽపి తవోపమా విరహిత స్తత్వం కథం నిర్దిశేత్
భోరోలంబ తవావలంబనవిధౌ సర్వేఽపి బద్ధాదరాః"

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౩౦. { వృష. జ్యేష్ఠ—భాద్రపదములు. } సంచిక ౨-౩.

## పత్త్రికాప్రశంస.

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు.



చ. జగతిని నీవొనర్చెడు ప్రచారముచూచి ప్రమోదమంది నీ
యగణితసేవ కోవిదులయందలి నేర్పిది యంచుఁ జెప్పఁగాఁ
దగునని వ్రాసినాఁడవు యదార్థపుఁ దత్త్వము సంతెగాని నిన్
బొగడఁదలంచి నాదుకలమున్ నడిపింపఁగలేదు పత్త్రికా !

ఉ. ముప్పదియేండ్లు వచ్చినవి పొందగు యౌవన మాక్రమించె నీ
గొప్పతనంబు నాంధ్రజనకోవిదు లెల్ల గ్రహించునీతి నే
ర్పొప్పఁగఁజేసి శుద్ధమగు సూక్తులఁ జాటితి వింతదాఁక నేఁ
డెప్పడి దేమి నీకుఁ జిరఁజీవిగ వర్ధిలుమమ్మ పత్త్రికా !

ఉ. కాలముమాఱె ఘోరకలికాలమువచ్చెఁ బ్రశాంతమున్న నే
మూలలనైనఁ గన్పడదు పొక్కుచునుండెను దెన్గుతల్లి యే
వేళను భాష కేగతిని విప్లవముల్ గననౌనొ యంచు, నీ
శీలము గొప్పదాట దరిఁ జేరఁగఁజాలవు నింద్యశబ్దముల్.

ఉ. నన్నయనాఁటిభాష, కవినాథులు చూపిన యట్టిత్రోవ, పె
ద్దన్న రసప్రయోగములయందలి యందము చందమెల్లఁ ది
క్కన్న తెలుంగుసొంపు వినఁగాఁ గనఁగాఁ బఠియింపఁగా
మహాభ్యున్నతితోడ లభ్యమగుచుండును నీయెడ నేఁటికైననున్.

ఉ. భాషను మార్చకుండఁ బరివర్తనమందొక మార్పులేక, యే
వేషముతోఁ బనేలయని విజ్ఞతఁగాంచి వివాద మాడ కే
రోషముగాంచఁబోక పది రూకలకై యెపుడాశలేక సం
తోషముతోఁ బ్రచారమును దోరపుభక్తి నొనర్తు వెప్పుడున్.

ఉ. నీవయ నాకు ముఖ్యమగు నెచ్చెలి వెయ్యేడనైనఁగాని శ్రీ
దేవివి నీవయంచు వెనుదీయక నిన్నెదఁగొల్తు భాషయం
దేవిధమైనలోప మొకయింతయుఁ గానఁగరాదు నీతికిన్
దావలమౌను నీ చరిత; తప్పవు పెద్దలమార్గ మెన్నఁడున్.

మ. అదియే నీకొనగూర్చెఁ గీర్తిధన మత్యంతంబుగా ధాత్రిలో
ముదమారన్ గడియించినావు కవితన్ బోషించు సామర్థ్యమున్
విదితంబయ్యెను దేశదేశములకున్ నీశక్తి యేనాఁటికిన్
వదలన్‌బోకుమ పెద్దలేఁగు సరణిన్ వర్ధిల్లు సౌభాగ్యముల్.

గీ. వృద్ధు లేఁగినమార్గంబు వీడఁబోక
సత్కవిత్వప్రచారంబు సాఁగనిమ్మ
కాలగతులకేనాఁడు జంకవలదమ్మ
కీర్తి వచ్చును లోకైకమూర్తి వనుచు.

ఉ. మెచ్చెడువారు స్వల్పమని మెచ్చనివారలసంఖ్య యెప్పుడున్
హెచ్చుగనుండునంచుఁ బఠియించెడువారలు తక్కువంచు లో
నచ్చువడంగ భీతి వడకమ్మ ప్రశాంతిగనుండుమమ్మ వి
ద్వచ్ఛ్రయముండె లోకమున భాస్వరకీర్తియు నీకుఁ గల్గెడిన్.

క. కాదని నిన్నదిరించిన
వాదములాడని భవత్ప్రభావముఁ జెప్పన్
రాదుగ; భాషా సేవా
రాధన తత్పరులకెల్లఁ బ్రమదంబగుతన్.

# సూరి.

## పుధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

గీ. చక్రవర్తి న్యుపాహృత సారరత్న
ఖచిత సౌవర్ణ కంకణ క్వణ దనర్ఘ
కావ్య కృన్నిజ కరకంజ ! నవ్యరీతి
నొసఁగుచున్నాఁడ నిదిగో ? నాయుపద గొనుము.

* * *

సీ. వచనవాఙ్మయకవిబ్రహ్మ నే నని చాటి
తెలుపఁగ నీతిచంద్రికను గూర్చి
విద్వత్కవిత్వసంపద్విష్టుఁడ నని
ప్రకటింపఁ గొన్ని కబ్బములు వ్రాసి
ప్రథమాంధ్రకోశప్రవక్త నే నని చెప్ప
వితతనిఘంటునిర్మితికిఁ దొడరి
యాంగ్లసారస్వతవ్యాసంగి నని తెల్ప
* న్యాయశాస్త్రము తెల్గునన్ రచించి
సర్వతోముఖ భవదీయశాస్త్రసార
వేత్తృతాస్ఫూర్తి చంద్రికావిసర మాంధ్ర
సుకవిచాకోరమునకును జూఱలిచ్చి
శాశ్వతుఁడ వైననిన్ను సంస్తవ మొనర్తు.

౨

శా. అన్నా, చిన్నయసూరి ! నన్నయబుధాధ్యక్షుం... మున్నెన్నఁడో
చెన్నుం బాసిన యీతెలుంగునకు వాసిం గూర్చి, యాంధ్రీయభా
షౌన్నత్యం బిది దేశదేశముల విఖ్యాతమ్ముగాఁ జేసి, న
చ్ఛిన్నాత్మప్రతిభాప్రకాశితకృతిన్ జింతామణివ్యాకృతిన్.

* ఇంగ్లీషు లా చట్టము.

3

గీ. పాణినీయశాస్త్రపఙ్క్తి నయ్యాది కేవ
లాంధ్రవిజ్ఞు లెఱుఁగ నైతి గాక
పరఁగుచుండ నీవు బాలబోధార్థము
తెలుఁగునందఁ గూర్చితివి మహాత్మ!

౪

శా. నీరక్తమ్మును దారవోసికొని యెన్నేలక్ష్మలక్ష్యంబు లిం
పారం జేరిచి, విద్వదాశ్రయముగా నవ్యాప్త్యతివ్యాప్తిసం
చారం బెచ్చోట లేక కూర్చితివి భాషావ్యాకృతిన్, దానిపై
హాహారాహారిగఁ జల్పుచుండి రిట వాగ్యుద్ధంబులన్ బండితుల్.

౫

క. హరికారికలకు నీవ్యా
కరణ మ్మనువాద మనియుఁ గా దనియు నెవో
పరివాదమ్ములు గల వవి
తిర మగుకీరితికిఁ గొఱంత దెచ్చున సూరీ!

గీ. శిష్టకవికి నీకు శ్రీకాళహస్తిలో
నేదొ వాక్యవాద మెనసి నప్పు
డాతఁ డోడె ననుచు ననుకొనుచున్నార
లార్య! నీవఁ గలయథార్థ మెంత?

౭

గీ. "సూరికి నేర్వాసిన హరి
కారిక లాధార"మని జగంబునఁ జాటం
గోరి యొక రేయిఁ దత్కృతిఁ
గూరిచె నతఁ డనియుఁ జెప్పికొందురు నిజమే?

౮

గీ. ఇంతకు నతండు "కారికావృత్తి గాని
మూలము రచింపలేదు నే మొఱ్ఱొ"యనుచు
వ్రాసికొనినట్లు విస్పష్టపడుచునుండె
శ్రద్ధ నరయంగఁ దాటాకుఁబ్రతులలోన.

౯

క. సమధిగతసర్వశాస్త్రా
గముఁడు, విచిత్రాత్మకావ్య కవితాలహరీ
క్రమ పరితోషితనృపజనుఁ
డమలాత్ముఁడు కృష్ణకవి బుధారాధ్యుఁ డగుఁన్.

౧౦

చ ఎఱుఁగవయేమొ ? కల్లురిబుధేంద్రుఁడు నీవు రచించినట్టి వ్యా
కరణము* గుప్తభావముఁ బ్రకాశ మొనర్చుచు నద్భుతార్థ వి
స్ఫురితము నొక్కవ్యాఖ్యఁ బరిపూర్ణముగాఁ బ్రకటించి, నీయశ
స్స్ఫురుచిరలక్ష్మి కొక్కనవశోభ ఘటించె నుదంచితంబుగన్.

౧౧

ఉ. కాని, యతండు శిష్టకవికారికలందు ౼ శిష్టగౌరవం
బూని నిరంతరంబుగ నెటో తనవాదము నిల్పుఁ బోంటె న
న్నని లిఖించెఁ గాని యొకఁ డేనియు విశ్వసనీయ మైనటుల్
కానఁగరాదు నాకుఁ; దలఁకం బని యేమి యథార్థ మెన్నఁగన్.

౧౨

గీ. అచ్చు టచ్చుట నీనిగూఢాశయములఁ
గొన్నిటిని దివ్యగాఁ గూర్చు కున్న నేమి
†టీక వ్రాసె "సారస్వ పేటిక" యనంగఁ
గీర్తి శేషుఁడు శ్రీ రామమూర్తి శాస్త్రి.

---

*గుప్తార్థప్రకాశిక:—శ్రీ॥ శే॥ కల్లూరి వేంకటరామశాస్త్రిగారిది.
†బాలవ్యాకరణ సారస్వసర్వస్వ పేటిక:—శ్రీ॥ శే॥ విద్వాన్ దూసి రామమూర్తిగారిది.

౧౩

గీ. తెలుఁగువ్యాకరణమున కాస్తిక్య మొసఁగి
యనుని మేషముఁ దద్గతైకాస్థకలిమి
నమితకృషి నల్పమావర్ష్యులాన్వవాయ
రత్న మును నీవు మఱవంగ రాదు సూరి !

౧౪

చ. మఱచితి నొక్కమాట రసమంజులవాక్యపరీత రీతి వి
స్ఫురణము గల్గునట్లు సుకవు ల్మది నెన్నఁగ నీతిచంద్రికన్
విరచనచేసినాఁడ; వటుపిమ్మట నిమ్ముగ నుత్తరార్థ మె
వ్వరు రచియించిరో యెఱుఁగవా? యది తెల్పద నాలకింపుమీ.

౧౫

గీ. కందుకూరి వీరేశలింగకవి దాని
మధురరచనావిశేషసంపద మొసంగఁ
బూరణ మొనర్చె రసపుష్టి పొదల; నైనఁ
"జిన్నయకుఁ జాలఁ" డనుచుఁ గేచిన్మతంబు.

౧౬

గీ వ్యాకరణఫక్కికకును వేదాంతపారి
భాషికపదంబులకు నేదొ బాంధవంబు
సన్నిహితముగఁ గల దని చాటుపొంటె
జతన మొనరించితివఁట నిశ్చయమె ? సుకృతి !

౧౭

గీ. వారణాసినుండి వచ్చినమీమాంస
కులను శాస్త్రవాదగోష్ఠిఁ దనిపి
నిరుపమాన "సూరి" బిరుదమ్ముఁ గొనినాఁడ
వాంధ్రకీర్తి మిన్ను నంటు నట్లు.

౧౮

సీ. శబ్దరత్నాకరోచ్చైర్నిఘంటున కేది
తల్లి యగాచుఁ బురోహితమ్ము గలిపి
సూర్యరాయనిఘంటువర్య మెద్దాని పా
ఠములను స్వప్రమాణముగఁ గొనియె
వివిధాంధ్రకృతిపాఠ భేదమ్ములం దేది
సందేహవిచ్ఛేద మందఁ జేయు
జిలుఁగుచేవ్రాఁత ముద్దులు మూటఁగట్టుచు
నెద్దానిప్రతి కంటి కింపునింపు
నట్టి నీవిశ్వకోశోద్ధ మస్మదాంధ్ర
భోజ పీఠాపురీప్రభు పోష్యమాణ
నూతననిఘంటు సంస్థామనోజ్ఞభవన
సీమఁ గై సేసియుండెనో చిన్నయసుధి!

౧౯

సీ. ఆంధ్రభారతికి దేశాంతరాభివ్యాప్తి
నొసఁగిన "బ్రౌను" చేయూఁత నీదు
బాసపైఁ గడివోని వల పూని చనినట్టి
[1]. నరసింహసెట్టి మన్ననలు సేయ
సార్థాభిధుండు హయగ్రీవశాస్త్రి నీ
సహపాఠి యగుచు నెచ్చరిక నొసఁగ
[2]. దేవరాజాదిసుధీమణిగణములు
ఛాత్రులై నిన్ను నిచ్చలు భజింప

1. కౌనర్ బిల్ శ్రీ గాజుల లక్ష్మీనరసింహులు సెట్టిగారు.
2. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య, బహుజనపల్లి సీతారామాచార్యులు (శబ్దరత్నాకరాదులు) మొదలగువారు.

[1]. పచ్చయప్పకళాలయ పండితత్వ
గౌరవమ్మున విజ్ఞసంఘములు వొగడఁ
జెన్నపురమున సుగముగా జీవయాత్ర
నొనరిచినవాఁడ వీవు ధన్యుఁడవు గావె?

౨౦

క. జాతులతోఁ బనియేమి? స
మాతతపాండిత్య శక్తిమంతుఁడవుగదా?
సాతానువాఁడ వైనను
జోతల నర్పింపఁదగదె సూరి! నీకుఁ.

౨౧

క. అకలుషగతి నెసఁగిన తా
వకచరితము సకలమును శుభం బగు భంగిన్
[2]. వకుళాభరణ మ్మనునొక
సుకవి తెనుంగున వెలార్చె సూరీ! వింటే?

౨౨

గీ. [3]. ప్రభవలోఁ బుట్టి దుందుభివత్సరమునఁ
దనువు వీడితె?—కట్టిఁడిదైవ మకట!
సరిగ నేఁబదియాఱేండ్లు తిరుగనీక
దాఁచఁబెట్టెను నీకయి రాచపుండు.

---

1. పచ్చయ్యప్పకళాశాలలో సూరి 1845-46-47-48 సం॥రలలో పండితపదవి నిర్వహించినట్లు కాలేజిరిపోర్టు (1847—48) సూచించుచున్నది. ప్రెసిడెన్సీ కాలేజిలోఁగూడఁ గొంతకాలము పనిచేసెను.

2. శ్రీనారాయణకవము వకుళాభరణము అను నతఁడు సూరి జీవితచరిత్రము రచించి ప్రకటించెను.

3. సూరి జననము 1806-మరణము-1862.
ఇతఁ డవసానదశలో రాచపుండుతో బాధపడియుండెను.

# విజయవిహారము

వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వాన్, చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఉ. ద్వైతవనంబులో విబుధవంద్యులు పాండవు లాత్మనిష్ఠ ని
ర్ధూతకదర్థఖేదులు వధూమణితో వసియించుచుండ, నా
పూతచరిత్రు లామునులపొందున సర్వశుభైకమూలముల్
పీతవికారబుద్ధిఁ గురువీరుఁడు గైకొనె ధర్మనిష్ఠతన్. ౧

ఉ. అంతట వార లావని నిరంతరశాంతి మెలంగుచుండ, వే
దాంతవిహారలాలసు మహాత్ముని సాత్యవతేయుఁ గాంచి, య
త్యంతము భక్తిఁ దన్మునిపదాంబుజహారి నఖాగ్రవిస్ఫుర
త్కాంతిలతాంతముల్ జడలఁ దత్పరతన్ ధరియించి రందఱున్ ౨

ఉ. తాపసయూథనాథుఁడు సుధారసపూర్ణకవిత్వయుక్తుఁ డా
ద్వీపజుఁ డాత్మజన్మపదివిన్ వెసఁ జేరఁ బరాభవోష్మసం
తాపితు లైనవారలు నితాంతజలస్రుతి దాల్చి రక్షులన్
దీపితవృష్టిఁ దేలవొకొ? దేశము సత్కవి స్వాతిఁ జేరినన్. 3

ఉ. మానివతంసుఁ డెంతొ బహుమానముతో నిడ విద్య నొందు, స
మ్మానితకీర్తి ధర్మజుఁడు మక్కువ మీఱఁ గవుంగిలించి, స
మ్మానముతోడఁ బంప పరమం బగునస్త్రము పొందఁగా హిమా
నీనగయాత్ర సల్పె గుణనీరధి పార్థుఁడు నీశుఁ గొల్వఁగన్. ౪

చ. హిమము ఘనీభవించి చలి హెచ్చుగ దేహము నొంచుచుండ నా
హిమగిరిఁ గాఁపురంబు వెలయించెడియక్షనికాయ మెల్లయుం
గములు మనోజ్ఞమై తనరఁగాఁ దనుమధ్యలపెద్దవానురో
జముల నకంపచోష్ణములఁ జక్కఁగ సేవ యొనర్తు రెప్పుడున్. ౫

శా. గోరూపంబును భూమి దాల్ప, పృథువున్ గోపాలుఁ డై చూడ, నే
పారం గోమలవత్సభావమున స్థాయన్నూత్నరత్నప్రభా

పూరక్షీరము చక్కఁ గ్రోలి, భర మైపొంగారఁగా నిస్సర
త్సారంబట్టు మనశ్శిలార్షురుల నాశైలంబు మించెం గనన్. ౬

గీ. బలిమిఁ బర్వత మెక్కునా పార్థునాన
నాబ్జమునఁ బొల్చు స్వేదకణాళిమధువు
పిల్లవాయువు గ్రోలి శోభిల్లఁ జేసె
భ్రమరభావము తన కెంతొ భాసురముగ. ౭

చ. జగములతల్లిదండ్రులు నజస్రము నొండొరు పీడ కుండఁగా
మగఁడును నాలి యై పొలుచుమంగళరూపము దాల్చినార లీ
యగమున సత్తపంబు చెలు వందఁగఁ జేసినకారణంబునన్
నగ డద మేము నట్టు లని నిత్యము ప్రొమొక్కెడి మానులం గనెన్. ౮

క. నగజాత మగనిఁ గోరుచు
నిగమాంతరచారిమానినికరము సతమున్
బెగడొందఁ దపము సల్పిన
నగమధ్యస్థితతపోవనంబుం జూచెన్. ౯

ఉ. మృగవృషభంబు డగ్గఱిన మేఁతను గానుక నీయనో యనన్
పిడికెఁడు దర్భఖండములు ప్రీతి భుజించుచు నెల్లవేళలన్
కడఁగి మనంబు నీళపదకంజములందుఁ దిరంబు చేసి య
వ్వాడు దొడఁగె నమ్మహామతి తపోనియమంబును బార్థుఁ డర్థిమై. ౧౦

చ. వివిధతపోవిశేషపదవీస్థితిఁ దాఁ దరాతినిర్జితం
బవని యటంచు పాదయుగమంతయు మోపఁగఁ గొంకువాఁడు నాన్
భువిని బదాగ్రమాత్రమునఁ బొల్చి, చలింపక యుంచు కేనియుం
బ్రవిమలనిష్ఠ మేర్పడఁ దపం బొనర్చెను నిష్ఠురంబుగన్. ౧౧

ఉ. భానుఁడు తీవ్రతేజమున ఫాలతలంబు తపింపఁ జేయు, స
మ్మానిత తేజుఁ డాకిరణమధ్యమునం దనదృష్టి నిల్పె; వై
శ్వానరుఁడుం గిరీటి నలువంకలఁ జుట్టఁగ నొప్పె; భుక్తికై
కానన మెందుఁ గోరి పదకంజములం బడి వేఁడువాఁడునాన్. ౧౨

ఉ. వాసవినామసామ్యమున బాంధవ మేర్పడియుంట నేమొ యు
ద్భాసితు నాధనంజయుని పార్శ్వములం దగెఁ గూర్చి; నట్టి లా
రా! సృజియించి తంగవిషయాధిపు వైరిగ నా కటంచు బల్
రోసము దాల్చె నాన్ ఖరకరుం బరికించును తీక్ష్ణదృష్టిమైన్. ౧౩

ఉ. వ్యాసమునీంద్రుఁ డర్జునుఁ గృతార్థునిఁ జేయ మహోపదేశముం
జేసినమంత్రభాగములఁ జిన్మయు శంకరు నంతరంగమం
దాస భజించి, యానియతి నందఱ మానులఁ గ్రిందుసేయ సం
తోసముఁ బూనెనో యనఁగ దొంతర లౌజస లూనె మౌళిపై. ౧౪

గీ. ఓలి ఫలపర్ణవాయువు లోగిరముగ
సేకరించుట విడువ నాశీలధనుని
యష్టగుణ మెల్లవేళఁ గరాగ్రమందె
లోల మయ్యెను విషయముల్ గ్రోల దయ్యె. ౧౫

ఉ. అంతటనిష్ఠతో నతఁ డహర్నిశముం దరుణేందుమౌళి న
త్యంతదయార్ద్రచిత్తు ననయంబును నాత్మవశం బొనర్ప నా
వంతయు భూతలంబునఁ బదాగ్రము మోపియు బాహులెత్తు చొ
ప్పెంతయు వింతగూర్చె నిటు లీతఁడు మోఁదిఫలంబు లందునాన్. ౧౬

చ. అనిలనిరోధ మేర్పడఁగ నబ్బుర మౌతప మాచరించున
ర్జునుశిరమందుఁ బుట్టి మిను సోఁకఁగ నగ్గడలంచుఁ బర్వి యే
చినవికటస్ఫులింగములఁ జిమ్ముచునూతనధూమరాజి యా
తనికి ధనంజయాభిధను తథ్యముగా నొనరించె నత్తఱిన్. ౧౭

ఉ. నారదమౌనివర్యవదనంబున వెల్వడువాక్కులన్ మహో
భారము గొన్నయర్జునతపంబు దయాంబుధి శంకరుండు సాం
పారఁగ విన్చు నుండ, జగదంబిక యాసభఁ గన్నుసన్న వా
వీరునిఁ జూడ నిచ్చ ప్రభవించెను నంచు నెఱుంగఁజేసినన్. ౧౮

గీ. సర్వమంగళ కెంతయుసంతసంబు
కలుఁగఁజేయఁగ మనమునఁ దలఁచి శివుఁడు

ఈయ నెంచియు ఫల్గుణాభీష్ట మపుడ
వేడ్క ధరియించె లుబ్ధునివేషబంబు ౧౯

సీ. ధరియించి రాదిమదంపతుల్ మాయాకి
రాతవేషంబులు ప్రీతితోడ
తిలకంబు దిద్దిరి ద్విపవదనాంచిత
గణనాథకరటపంకంబుతోడ
జడకుచ్చు గట్టిరి స్కందవాహనశిఖి
పింఛంబు నించుక ప్రిదులఁ జేసి
తాల్చిరి కటిని మందాకినీనిమ్నగా
తీరవృక్షచ్ఛదచీరములను

గీ. ఎఱుకసానియు మఱియు నాయెఱుకఱేఁడు
విల్లు నమ్ములఁ దాల్చిరి వెరవు మిగుల
పూసి ధరియించి రమ్ములపొదులఁ గటిని
స్వీయపరికరబంధంబు సిద్ధి నొంద. ౨౧

గీ. పరపురుషుఁ డిట్లు శబరత్వధరుఁడు గాఁగ
మొదటివర్ణంబు శశిఖండపదముఁ దొలఁగి
చయ్య నొరుఁ జేరఁ బఱఁ డంత శబరుఁ డయ్యెఁ
బొలిచెను శిఖండ మై శిరోభూషణంబు ౨౧

ఉ. తోడన రాజతాచలము తొయ్యలితోడ హరుండు వీడ, వీ
రేడకుఁ బోవువారొ యిటు లెక్కటి నందుడు సంశయించియున్
వేడుక మీఱఁగా శబరవేషములన్ ధరియించి ప్రక్కనన్
గూడిరి వారలన్ ప్రమథకూటము లొండొరు మీఱ సందడిన్. ౨౨

సీ. తోఁకల నిట్టటు త్రుళ్లింపఁ జేయుచుఁ
బలు తెఱంగులఁ గానఁ బరుగులిడుచు
దూరచారశ్రమ తోర మై పొడమిన
నలసట మేనెల్ల నలయఁ జేయ

ప్రేలెడు నాల్కల లాలాజలంబులు
జాలువాఱఁగ వనసరణి నెంతొ
స్వచ్ఛతరంబుగా వలుపుచు; దృఢతర
శ్వాసంబులను దేహచలన మొప్పఁ
గీ. బొదలఁ జొచ్చియు మృగముల వెదకి వెదకి
ఘుంకరించుచు బీరంబు పొంక మమర
విశ్వనిగమము లనియెడి వేఁటకుక్క
లిరుగెలంకులఁ దవులుచుఁ దెరలె నపుడు. ౨౩

క. కరభూషణముగఁ దాల్చిన
హరిణకిశోరంబె మృగవధూకర్షణకై
వెర వగుదీపకమృగగతిఁ
గర మొప్పఁగ వెంట నంటి కానఁగవచ్చెన్. ౨౪

చ. జననియు శంకరుండు హిమశైలదరీపథ మంటి రాఁగ, ప్ర
క్కన వనదేవతావసతి కోమలకల్పకపల్లవంబులన్
ననలను జల్లి, ఘోరతుహినంబున వారల కించుకేని వే
దన గలుగంగ నీక ప్రమదంబునఁ గొల్చెను మార్గమెల్లెడన్. ౨౫

ఉ. ఎక్కడివార లీమొఱకు లెన్నఁడు పూర్వ మిటుంగ రారు; వీ
రక్కట మాయరణ్య మిటు లాక్రమణం బొనరింప నేరత
మ్మొక్కొ యటంచు నాయడవినొప్పుకిరాతులు రోస మెక్కఁగా
నొక్కమొగిన్ సమాగతుల యుక్కడఁగింపఁ గడంగి రత్తఱిన్. ౨౬

గీ. శంకరునిదివ్యతేజఃప్రసారకలన
శబరయువకులయుత్సాహసరణి యంత
చల్లనయ్యెను; గుండెలు జల్లు రనఁగఁ
జూచుచుండిరి వారలు చోద్య మంది. ౨౭

సీ. మానివరేణ్యు లామాయాకిరాతుల
వేడబంబులఁ గాంచి వెఱఁగు నంది

మార్గమధ్యమున విమానవేగము నాఁపి
భక్త్యతిరేకంబు పల్లవింప
ప్రీతి జటావల్లరీమూలపల్లవం
బుల నంజలిపుటంబు లలవరించి
హర్షాశ్రుసమ్మిశ్రితానిలంబులతోడ
జయజయశబ్దముల్ జడిగొనంగ

గీ. తలరి యాజగదాదిమదంపతులును
నియమ మేర్పడఁ దపమును నిర్వహించు
నాసునాశీరసుతతపోవాసభూమి
నడుగు లిడఁగఁ దొడంగి రత్యంతప్రీతి ౨౮

చ. శ్రవణమునందు వ్రేలఁబడుసారతరంబగు నక్షమాలికన్
దవులుట తెక్క లూడినవిధంబునఁ బొల్చెడి బాణపంక్తి నా
శివునిశరీరమం దడరఁజేసెను; లింగమయస్వరూపుపై
నవసుమపుంజముం గురిసెనా? యనుభాతి దలిర్ప నత్తఱిన్. ౨౯

శా. పాదాగ్రంబుల నంటి వ్రేలెడుజటాభారంబు నంధించి, స
మ్మోదం బొప్పఁగ నాతపమ్ము యశనమ్ముంగాఁ దపోవృత్తిని
స్ఫాదక్షత్వము నూని యుంట గతదోస్సారున్ బృథాసూనుఁ బ్రే
మాదార్యంబులఁజూచునాయుమకుఁబుత్త్రౌత్సుక్యమొప్పం గడున్.

ఉ. అంతట భూమిభాగము ఖురాగ్రములం జదియంగ మెట్టుచున్
వింత దలిర్పు రోసమున వేమఱు ఘుంకృతి సల్పుచున్ మహా
ద్భ్రాంతశరీరవైకృతిని దాల్చినకోలము ఫల్గునాశ్రమో
పాంతమునన్ భయంకరవిహారము సల్పఁ గడంగె నత్తఱిన్. ౩౧

చ. భయదవిహారముం గొని విభాసిలునాకిటిఁ జూచునంతనే
రయమునఁ గృష్ణశాబనికరం బటు వల్కలమందు డాఁగ, వ్రేఁ
గయినగళస్వనంబుల విహంగమపంక్తి భయంబు దెల్పనన్
నియమము నుజ్జగించి వెస నించెను జేతఁ గిరీటి చాపమున్. ౩౨

గీ. ముఖర మగునట్టు గుణమును మొరయఁజేసి
వీరమాన్తియుఁ గిటి నేయ వెడలునంత
వనచరులు వెంట నంటఁగా శబరుఁ డొకఁడు
ధనువు నెక్కిడి తఱుముచుఁ గనఁగ వచ్చె. 33.

చ "విడువకు బాణ మోరి కిటివెంబడి నే నిటు చాలఁ బ్రొద్దుగా
నడుగక వచ్చుచుంటి" నని యుద్ధతిఁ బల్కు కిరాతువల్కులన్
పెడచెవిఁ బెట్టుచుం బరిభవించినగర్వము మీఱ నాకిటిన్
వడిఁ దెగనేసె నస్త్రముల ఫల్గునుఁ డంత నఫల్గుసారుఁ డై. 3౪

ఉ. ఆసమయంబునందె శివుఁ డస్త్రముసేసె శివార్జునాస్త్రవి
న్యాసము నేకకాలమున నక్కిటిదేహము నొవ్వఁడుస్సి పే
రాసను దానియాయువు సమాంశముగా భుజియించె; సోదరుల్
కాసుకు మీస మైన జనకద్రవిణంబు భుజించుకై వడిన్. 3౫

క. శబరునివచనములను వినఁ
బ్రబలం బగురోష మంతరంగము గలఁపన్
తబిసి యగువిజయుఁ డదలిచి
నిబిడం బగుకాంతిఁ బూని నేర్పునఁ బలికెన్. 3౬

సీ. నాయధికారంబు నాఁటి యున్నట్టియా
యాశ్రమంబునఁ గోల మడుగుపెట్టె
కాంచినయంతనే కడఁకమైఁ జేసితి
శరపాతమునకు లక్ష్యంబు గాఁగ
వీరుఁడ నై నసన్ పిఱిఁడిగా నెంచి
యవహేలనము సేయ నదరి తీవు
అమ్మ వమ్మాటకు నుమ్మ నీ వుద్ధతి
బాణముల్ దీనిపైఁ బఱపినావు

గీ. శాపదానముననొ లేక చాపముననొ
నీమత్తు ల్లంత యడఁగింప నేర్పు గలదు

లోలి భూమిని వ్రాతె నత్యుజ్జ్వలముగ
ఫణిఫణామణు లుర్విపైఁ బడెడుభంగి. ౫౦

ఉ. ఆజగమేలుతండ్రి హరుఁ డర్జునచాపముఁ బ్రేటు నంది, ని
ర్వ్యాజము గా మనంబునఁ గరంబు వహించినహర్ష వార్ధి నే
రోజను బోలదయ్యె; మును రాంకృతిమీరు గజాస్యుఁ డొప్పి వి
భ్రాజితలీల గంగదరి వప్రవిహారము చేయువేడుకల్. ౫౧

సీ. గాండీవ మిదియ మున్ ఖాండవం బేర్చెడి
సమయమ్ము నగ్నికి సాయపడియె
తక్షకునిల్లాండ్రు తరలి నశింపఁగా
ప్రథమకారణ మైనబడితు యిదియ
ఇంద్రుఁ డడ్డము రాఁగ నెట్టునా జొరనీక
వెతలఁ బెట్టినయట్టి విదురుసుమ్ము
పెద్దకాలమునుండి పేర్చినవైరంబు
మనజాతితోడఁ దాల్చినదిసుమ్ము

గీ. అనుచుఁ గ్రోధము దాల్చి యాహారునిమాళి
జడలగుబురున వాసంబు సలుపుచున్న
ఫణులు తటి చూచి దాని భక్షణముసేసె
ననఁగ గాండీవదండంబు నణఁగె నచట. ౫౨

సీ. దైవవిపర్యయం బీవిధిఁ గల్గెనా
అటుగాక వీనిమాయావిధంబొ
భావింపఁగా రానిపథ మిది యేదియో
తెలియకున్నది నాకుఁ దేటపడఁగ
అంచు నడంద నొక్కించుక చింతిలి
ధైర్యంబు నంతలోఁ దాల్చి క్రీడి
ఉత్సాహశక్తిలో నుజ్జ్వలమై పొంగ
నీశ్వరు గద్దించి యిట్టు లనియె

గీ. ఎఱుక ! మూఢాత్మ ! నీ వెట కేఁగఁ గలవు
అర్జునునిఁ గూడ నిర్జించి యశము గొనఁగఁ
జాలెదవురా ? యటంచుఁ దర్జనము చేసి
తలపడఁగఁ జొచ్చె బాహుయుద్ధమున కతఁడు. ౫౩

గీ. తపసి, నిష్ఠురతరముష్టితాడనమున
శబరవీరుని వామవక్షమున వ్రేయ
నెఱుకసానియురంబున వఱలునట్టి
తెల్లగురివెందపేరులు త్రెవ్వ వడియె. ౫౪

చ. చిరముగ నిత్యుపాసమునఁ జిక్కినయామునివక్షమందు శం
కరుఁడును ముష్టిమార్దవము గ్రమ్మఁగఁ గ్రమ్మఱ నేసె వాని, నా
హరువున నింద్రసూనుహృదయంబున వాసము గొన్నతన్ను దు
ర్భరశరపాతవ్యథలు పాయఁగఁ జేయఁ గడంగెనో యనన్. ౫౫

సీ. ముష్టిప్రహారముల్ ముమ్మరమ్మై చన
నొండొరు మీఱ వా రుదుటుగొనిరి
పెనఁకువల్ పెరుగఁగ వనకుసుమపరాగ
భస్మాంగరాగలేపములు గొనిరి
ఒక్కొక్కబాహువు నొవ్వఁగా సారించి
జడల నొండొరు నొంపఁ గడఁగి రపుడు
తెక్కినభుజమునఁ దార్కొని యన్యోన్య
గళనాళములు చుట్టఁ గడలుకొనిరి

గీ. శబరవిభుఁడు తపోధనసత్తముఁడును
నొండొరుల మీఱ నుద్ధతి నొనరఁ దాల్చి
సమబలత్వము చెల్ల నాహిమనగంబు
పెద్దచఱియను గూలిరి పెలుచ నపుడు. ౫౬

చ. శబరు నధోముఖంబు గొనుచందమునం ధరఁ గూలనేసియున్
బ్రబలి విమోహ మేర్పడఁగఁ బార్థుఁడు నిష్ఠురప్రస్తరస్థలిన్

నిబిడముగాఁ గవుంగిటను నించినచో భ్రమరోన్నగంబుతోఁ
దలిసిని నన్నుఁ గాచెడికతమ్మున నల్లునిఁ దెల్పఁ గోరునాన్. ౫౭

ఉ. సంగరమందుఁ బార్థునిభుజంబుల నొప్పెడివీర్యరేఖ నొ
ప్పం గని శంకరుండు బహుభంగుల విస్మయ మంది మౌళిపైఁ
బొంగెడుజాహ్నవీవిమలపూరకణంబులు గంటిమీఁదఁ జే
రం గడుపీడ నందియు శిరశ్చలనంబు వహించు వేడ్కమై. ౫౮

గీ. ఈగతిఁ దడవుగ భూమి న
ధోగతుఁ డై యుండి కలఁత దొలఁగిన సంజ్ఞా
స్వాగతసముదాచారన
మాగమమున నింద్రసూనుఁ డల్లన లేచెన్. ౫౯

ఉ. కన్నుల విప్పుచో నెదుటఁ గానఁగవచ్చెఁ గిరాతుఁ డే ప్రభా
భ్యున్నతదివ్యతేజమున నొప్పినశంకరుఁ, డాకిరాతియే
యున్నులమిన్న సర్వజగదంబిక యాగిరిరాజకన్య, యిం
కెన్నఁగ శక్యమే సాటి గదెట్టిగుణజ్ఞుల కైన నయ్యెడన్. ౬౦

ఉ. వీనులవిందుగా నమృతవృష్టిని జిల్కెడుభంగిఁ గంఠగ
ర్జానినదంబుతోఁ బటుతరం బగుఘంటలతాంకృతుల్ మృదు
ధ్వానము లీన లోకదురితంబులు చెండుమహోక్ష మెక్కి శ
ర్వాణిని గూడి శంకరుఁడు వచ్చె నలంకృతసర్పహారుఁ డై. ౬౧

క. పారిషదగణము లంజలి
సారసవన మొందవఁ జేయ సరసత నతుమన్
గౌరీకాంతుఁడు దివ్యవి
హారముతోఁ బొలుచురాజహంసం బయ్యెన్. ౬౨

సీ. మార్దవసముపేతశార్దూలచర్మంబు
పల్యయనంబుగా వటుల, మీఁద
నడ్డంబుగాఁ జరణాంబుజయుగ్మము
ప్రసరింపఁజేయఁగఁ బ్రక్కఁ జేరి

యాదటనిూఱ శిలాదకుమారుండు
　　సంవాహనము ప్రీతిఁ జలుపుచుండ
దర్పము నిగుడ నుల్లావనంబు చేసెడి
　　తటి యానమును వాఁవఁ దగినరీతి
గీ. గళము పై వ్రేలుకనకశృంఖలను జేతఁ
బూని యత్యంతమృదుకరపుటముతోడ
కకుదశృంగంబులను మెల్లఁగా నిమురుచుఁ
జెంత మెలఁగెడిశృంగితో నెంతొ యొప్పె. ౬3

ఉ. శంకరమౌళిసీమ ననిశంబు విభూషణ మై తనర్చునే
ణాంకుఁడు గాండివాతికతినాహతి నుక్కఱి నంచుఁ దారకల్
కింక దొలంగ నాప్రియునికిం దగ నూఱటఁ గూర్ప వ్రాలె న
న్యంక దలిర్పఁ గల్పసుమసంహతివృష్టి దలిర్చి శర్వుపైన్. ౬౪

చ. కడుగొని సారమేయములకందువ నొప్పెడినాల్గు వేదముల్
వెడఁగు దలిర్పఁగా నపుడె విశ్రుతపూరువరావ మేర్పడన్
జడలను భస్మముల్ మృదుకుశంబులఁ జీరలఁ జేతఁ దాల్చి యా
మృదుబిరుదంబులన్ స్వరము మించఁగ గానము చేసె నింపుగన్.

ఉ. అంబరవీథి దగ్గఱుచు నబ్బుర మేర్పడఁ జూచి వేడ్కతో
తుంబురముఖ్యవైణికులు తోరముగాఁ దమగీతిరీతియో
గంబున నామహేశు ననుకంపను భక్తజనౌఘరక్షణా
లంబనసత్కథల్ మృదుకలంబుగఁ బాడిరి భక్తివెంపునన్. ౬౬

గీ. భూతనాథుఁడు తనశ్రవఃపూరముగను
పొసఁగఁ దాల్చినతాపింఛకుసుమగుచ్ఛ
మునఁ దొలంగెడితేనియసోనవనమున
మించుచూపులఁ గృపను వర్షింప నడరె. ౬2

గీ. అర్జునోన్ముక్తబాణప్రహారజాత
వ్రణము లి ట్లంగ మెల్లెడ వఱలె ననఁగ

విమలదీప్తివితానంబు వెల్లివిరియు
ఫణిపణారత్నభూషలు పరిఢవించె. ౬౮

క. అవతంసచంద్రరేఖా
ప్రవిగళితమయూఖపరంక్తిపాతజశైత్యం
బు వహింపనియటు దిటులిన
గవున హృదంతఃప్రసాదగతి సూచించెన్. ౬౯

ఉ. వాసవి యాదిదేవు మునివంద్యుని శంకరుఁ జూచునంతఁ బ
ద్మాపరణంబు ద్రోయఁ బటుభారము దాల్చినసమ్మదాశ్రురే
ఖావళి దేహమందుఁ బులకాంకురముల్ వెలయింపఁ బాదప
ద్మావనతుండు నై నతుల నర్పనచేసెను వేనవేలుగన్. ౭౦

శా. స్వామీ! నే నిటు మూఢబుద్ధి నయి నీసామర్థ్యముం గాన కి
క్లేమేమో పచియించినాఁడ; మనమం దీ సొప్ప వాగ్బాణచా
పామోక్షంబులు, ముష్టిపాత మన నా దైచెల్లు నేరంబు ల
త్యామోదం బొలయన్ క్షమించి కనుమయ్యా నన్ దయాంభోనిధీ.

ఉ. ఈవిధి విన్నవించి తనయోగ్యున కెంతయు వేఁగునర్జునిన్
దీవన లొప్పఁగాఁ దెలఁచి దేహము నల్లెడఁ గల్పకల్లవ
శ్రీ వెలయించుహస్తమును జేర్చి వ్రణంబుల మాయఁజేసి, యా
శావసనుండు సజ్జనవశంవదుఁ డిట్టులు పల్కె వానితోన్. ౭౨

గీ. ఆహవోద్ధుర సీదుమూఁడవదియైన
యింతయపరాధమున నెంత సంతసంబు
గలిగెనో యంతహర్షంబు గలుగ దయ్యె
భక్తిఁ దపమునఁ బూజాప్రసక్తినైన ౭౩

ఉ. అక్షణమందె శంకరుఁడు నమ్మలు చాపము మున్నుగాఁగఁ దాఁ
గుక్షిని గొన్నవానిఁ, దమఁ గోరినపాశుపతాస్త్ర మష్టప్ర
త్యక్షముగాఁ గిరీటివశ మందఁగఁజేసెను హర్ష మొప్ప, నా
దక్షునిగాండివాహతివిధంబున కిచ్చుబహూకృతిం బలెన్. ౭౪

# భీముని నయోక్తులు.

ఉ. ప్రేయసి ప్రీతితోడఁ బచరించిన భాషణభంగి తోప మెం
తో రుచిరంప నర్థభరయుక్త మటంచు మదిం దలంచి, య
త్యాయతయుక్తియుక్తము సదారతరార్థము నైన వాక్యమే
ధానిధియా వృకోదరుఁడు ధర్మజుతోఁ దగఁ బల్కె నీక్రియన్. ౧

ఉ. మానినిస్నేహదృష్టిఁ గనిమం బరికించియు నీతిమార్గముం
బూని మెఱుంగఁ జేసిన యపూర్వవిధానము నెంచిచూడఁ దా
నానని చెప్ప శక్యము బృహస్పతికైనను నిట్టిభంగి వా
మానసమందు విస్మయ మమందగతిం బ్రభవించె నీయెడన్. ౨

గీ. తీర్థకారుఁడు మార్గంబు తెలిపి సేయ
మడుగులోనఁ బ్రవేశింపఁ గడఁగు టొప్పు;
కార్యపథము నిరూపింపఁ గలుగు నతఁడు
తొలుత లభియించుటయె కడు దుస్తరంబు. 3

చ. అనయము సద్గుణంబులను నాదరమొప్పఁగ సేకరించు నీ
మనమున కీ మృదుపల్కు లనుమానము లేక రుచించుఁగాక; స
జ్జనులు గుణజ్ఞు లెన్నఁడు విచారము సేయ రొకించుకేని కా
మిని మగవాఁ డటంచు, మది మెచ్చెడిభంగిని బల్కు చోటులన్. ౪

ఉ. నాలుగువిద్యలందు గణనం గొనఁజాలువివేక మాని యీ
లీలను నీదు డెందము చలించి, విపర్యయమంది, పంకమం
దోలి నణంగి క్రుంగెడు మదోద్ధురసింధురభంగి దోఁచఁగాఁ
గూలుచున్న దో నృపతికుంజర! యిట్టుగ నెంత గర్హ్యమో? ౫

ఉ. వైరిజనంబు దేఁకల విపద్దశ నీ విటు పొందియుండఁ బా
కారిముఖామరప్రవరు లగ్గలి సంస్తుతి సల్పునట్టి నీ
పౌరుషమంతయుం బొలిసె; భావ్యమె యిట్టి విపత్తు నందఁగా
నారయ నింతకంటెను మహత్తరదుఃఖ మొకండు గల్గునే? ౬

చ. కరుల నిభుర్వ్యసంకట లబాతిగ బెంపుగొనంగ జూచి లో
బెరయునసింహమే బగెకించి, యపేక్షవహించునట్టి భూ
వరుని సమాశ్రయంబు నవకాదభయంబున నజ్జగించి వే
సిరులు దొలంగిపోవ వశీలనసేయ శోకితయోనియున్. ౭

చ. తియనము పేతుడయ్య నహాజంబున లోకశుభావహంబు త
త్రియజనవమ్మతంబు నగు తేజము దాల్చి సమృద్ధినొందగో
రియ జలనంబు వల్పభూభుజు నరిందమునిం బ్రజ లెల్లవేళ మో
దయుతముగా ద్విశీయనిధుకర్పనముంబలె గూర్తు రంజలిన్. ౮

ఉ. మానధనాగ్రగణ్యు డభిమానయుతుండు ప్రియోన్నతంబునా
స్థానము నొందగోరునయశాలిక పూర్ణ మనస్వి తెయ్యెడం
బూనిన యాత్మపౌరుషము పొల్పగు సాధన మంచిచూడ న
ద్దాన ననర్థజాతము నదల్పగజాలెడు శక్తి యేర్పడున్. ౯

ఉ. అవద లాక్రమించు నయనంబున పౌరుషహీనవృత్తి; న
త్వావదు పేతుకృత్యములు నాయతిలేక వినాశమందు; ని
ర్వాపితభావివృద్ధియుతుడం ము లాఘవ మొందు; దాన దు
ష్ప్రాపము గాదె గౌరవసమాసథం బగు రాజ్యలక్ష్మి యున్. ౧౦

గీ. కాన నిదనాడు మున్నతి కానమైన
వక్తి యుద్యోగరాహిత్యవర్తనంబు
సంతతము ను బరాక్రమాశ్రయమ్ములైన
సంపదలు దుఃఖములతోడ జనవు గొనవు ౧౧

మ. మదసంసేకసమేధితానన లసన్మత్తేభకుంభంబు ల
న్మదలీల న్విదళించి, తాగొనిన మేదఃపూర్ణ మాంసంబుచే
మ దమొప్పం జరియించు గేసరి; జగంబుల్ స్వీయతేజంబునం
గదలం జేయగ జాలుధీరు డెపుడుం గాంక్షింతు డన్యార్థముల్. ౧౨

ఉ. వైరినికారనష్టు డనవద్యపరాక్రమసంయుతుండు దు
ర్వారయశుండు నైననరపాలుడు గర్వరప్రాణయుక్తి బెం

పారదకీర్తిఁ గోర సచిరాంశువిలాసనకాశమైన ల
శ్శ్రీరవణీసమాగమ మతించనకాయ గాదె యెంచఁగన్.	౧౩

గీ. జనుఁడు స్వప్నశయింపఁ దుజ్జ్వలజ్వలన మెపుడు
భస్మరాశి సుఖంబుగఁ బట్టఁగలఁడు
కాన సభిభూతిభయమున మానధనుఁడు
చయ్య నసువుల విడుచుఁ; దేజంబు విడఁడు.	౧౪

ఉ. ఏమిఫలంబు గోరి హరి హెచ్చిన రోషముతోడ గర్జదు
ద్దామఘనాఘనంబు జెనకి ఘోరతరంబుగ ఘీంకరించు; తే
జోమయమూర్తియై నగడు శూరుని కయ్యెడ వైరియున్నతి
స్థేమము లోర్వకుండు టది సిద్ధము గాదె స్వభావసంపదన్.	౧౫

చ. అవధినిరీక్షణంబు తగు నంచు మనంబున నెంతువేని భూ
ధవ! సతతంబు జిహ్వగతితత్పరుఁడైన సుబోధనుండు నా
హవ మొనరింపకుండఁగనె యబ్బినసంపద లాస్వదించుచు
న్నవినయవృత్తియై విడఁగఁజాలునె యట్టి వివేకహీనుఁడే.	౧౬

ఉ. ఏ కాలవేళ సజ్జనులతోడను దాల్చి సుబోధనుండు దు
ర్లోకమునైన రాజ్యపదముం దగ నీ కిడనేని భూవరా!
నీ కనుజన్ములై జగతి నిచ్చలుఁ గీర్తి గడించియున్న యీ
మా కిఁక నేమి చేయఁగల సమందభుజక్రమవిక్రమంబునన్.	౧౭

ఉ. దిక్కుల వన్నెకెక్కి చనుదెంచెడి దిగ్గజభంగి దోఁచుఁ, జెం
పెక్కిన వాల్గసంద్రములు నల్లలు దాఁటియు వచ్చుచున్నవో
యిక్కరణిం జెనంగ నను నేఁడు దలిర్ప రణంబు సల్పఁగా
నక్కునమానసమ్మునున నిల్వను శక్యమె వైరికోటికిన్.	౧౮

గీ. కాన నృపవర్యమోహంబు గానిక
విక్రమముఁ బూనఁగా మది వెరపుగొనుము
నీ నిరుత్సాహమున వైరినికరమునకు
లేకయుండెడి వితతులు లేశమైన.	౧౯

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

శ్రీపిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమున్ను, 975 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగా నున్నవి. ఇందు ప్రథమ సంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చు లాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'ణ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'త' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీక్రింది వెలలు నిర్ణయింపబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు, చతుర్థసంపుటము సాదాప్రతి రు 4 లు, మేలుప్రతి రు 5 లు. ఈ సంపుటములు కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున దొరకును.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౬. { సర్వజిత్తు. చైత్ర - ఆషాఢములు } సంచిక ౧. ౨.

## విస్మృతప్రబంధపద్యావళి.

కాకమాని గంగాధరకవి — బాలభారతము.

౧

శా॥ క్రీడాలోలత దంతకోరకశిఖం గీలించి భూచక్రముం
గ్రోడగ్రామణి మించియెత్తి ఫణు లక్షుద్రానుమోదంబునన్
జూడాభోగము లెత్తి చూడఁగ దిశాశుండాలరాణ్మండలిన్
వ్రీడం బొందఁగఁజేయు దంతిముఖు నిర్విఘ్నార్థమై కొల్చెదన్।

౨

శా॥ శ్రీరామాయణకావ్యకల్పనవిరించి స్వేదఘంటాపథో
ద్ధారప్రౌఢమనీషి సర్గముని మార్తాండున్ దపఃకీర్తి ల
క్ష్మీరమ్యు న్భువనైకవంద్యుఁడగు వాల్మీకిం గవిగ్రామణిన్
ధారాళస్థిరభక్తియుక్తిఁ దలఁతున్ దత్త్వజ్ఞచూడామణిన్।

---

పరిషత్పుస్తకభాండాగారమునందలి సం. 3326 వ గలతాళపత్త్రప్రతినుండి సేకరించి విస్మృతప్రబంధ పద్యావళి నిటు ముద్రించుచున్నారము.

ఆం. సా. ప. సంపాదకులు

3

శా॥ సంసారార్ణవపారగుం బరమహంసవ్రాతచూడాపదో
త్తంసంబున్ శ్రుతిసంశయోద్దళన పాథఃక్షీర భేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు జలదశ్యాము న్మహాపాతక
ధ్వంసాధారతు భారతామృతనిధిన్ వ్యాసుం బ్రశంసించెదన్॥

౪

సీ॥ జైవారమొనరింతు గంభీరసాహిత్య
ఘంటాపథోద్భాసుఁ గాళిదాసు
వర్ణింతు నుజ్జ్వలవాణీసుధాపూర
పాథోధిపరిబాణు భట్టబాణుఁ
బ్రణుతింతు నుద్దండభాషాసమాక్షిప్త
హారబాహు కేయూరుఁ డగుమయూరు
సన్నుతి గావింతుఁ జటుధారాప్రౌఢిఁ
గోమలతాయత్తు సోమదత్తు
గీ॥ భక్తి నంజలి రచియింతుఁ బ్రవరసేన
భాస శివభద్ర భవభూతి భట్టహర్ష
భారవి మురారి హేరంబచోరులకును
మఱియుఁ దక్కిన సుకవుల మదిఁ దలంతు.

౫

క॥ శబ్దార్థ రసవిశారదు
శాబ్దికమూర్ధన్యు శబ్దశాసనబిరుదున్,
శబ్దాయమానవిస్ఫుర
శబ్దఘటారభటి నన్నపార్యుఁ దలంతున్॥

౬

ఉ॥ ఆంధ్రకవిత్వతత్త్వ సముదంచితకీర్తినిఁ దిక్కయజ్వ సీ
రంధ్రితరప్రభావనిధిఁ బ్రస్తుతి సేయుదు... నుల్లస
త్కంధ్రగభీరమంజుతర గర్జిత విభ్రమభవ్యభంగి సై
రంధ్రికమైన చాటుమధురస్ఫుట (మంజుల) వాగ్విజృంభికన్॥

౭

క॥ ఇంద్రప్రస్థం బనుపురి
సాంద్రమహేంద్రాశ్మకాంతిసంతతులను ని
స్తంద్రంబై విలసిల్లెను
జంద్రాతప ధవళచంద్రశాలా యుతమై.

౮

శా॥ ధారాపాతవిభాతి శీతకరకాంతస్ఫారగేహంబు లీ
యూరం జంద్రికమీఁదఁ బర్వ ను·చున్ వ్యాధాంబుధారాశతం
జేరుం జాతకపంక్తి చిత్రములు రంజిల్లన్ మయూరంబులున్
సారస్యంబుల లాస్యముల్ మెఱయు నుత్సాహంబు భూపాలకా॥

౯

గీ॥ ఇంద్రమణిజాలములయందుఁ జంద్రముఖుల
వాలుఁగన్నులు యమునయావర్తనముల
మెలఁగియాడెడి వాలికమీలనంగ
న (లువ) గనుపట్టు నీపట్టణంబునందు॥

౧౦

శా॥ చంచత్కేలి సరస్తటీమరకతచ్ఛాయా కదంబంబు గ్రొ
మ్మించులొల్కినఁ దమ్మిలిమ్మలను గిమ్మీరంబులై యుంట సం
ధించు న్వాసనఁ జంచరీకములు మందీభూతసందేహతన్
సంచారించుచు నల్లగల్వవిరులన్ ఝుంకారశంకారులై॥

౧౧

సీ॥ పురుహూత విస్ఫూర్తి భూమండలంబెల్ల
　　　భుజవిటంకంబునఁ బూనినాఁడు
గీర్వాణదుర్వారుఁ గేశిదానవుఁగొట్టి
　　　విజయలక్ష్మియుక్తి వెలసినాఁడు
లబ్ధినచ్ఛలికానిలలితోరుపీఠికఁ
　　　బొడమిన పూఁబోడిఁ బొందినాఁడు
నవయుగద్వీప భూనాథచూడారత్న
　　　మిత్రశాసనలీల మెఱసినాఁడు

గీ॥ విమలకీర్తి మందాకినీ వీచినికర
పూరపాతాళ మర్త్యవిబుధనివాసుఁ
డై కరంబొప్పు సోమాన్వయప్రభుండు
చారుకీర్తి పురూరవశ్చక్రవర్తి॥

౧౨

శా॥ మత్తారాతి మహాంధకారపటలీ మార్తాండుఁ డుద్ధాటికా
దత్తోద్యత్తురగావళీఖురపుటోత్పన్నక్షమాధూళికా
మత్తాంభోధి యయాతిఁ జెప్పఁదగు నుద్యద్వజ్రధారాప్రభా
జిత్తేజున్ శితకీర్తి కైతకదళశ్రీనూతనాంభోదమున్॥

౧౩

గీ॥ అట యుధిష్ఠిరుఁ డప్పంకజాక్షి ధౌమ్య
దత్త (నవ) వహ్నిధూమకందళిత శిఖలు
మగువఁ గూడిన రాయంచ మధుపశబల
నలినములఁ బోలెను బ్రదక్షిణంబుసేసె॥

౧౪

శా॥ ఆలజ్జావతి ధౌమ్యపంపున శిఖివ్యాలోలకీలాలిపై
నోలిన్ వ్రేల్చిన లాజరాజి సవనప్రోద్భూతవారాసి వీ
చీలోలోద్ధతివిద్రుమాటవి నధిక్షేపించు కట్టాణిము
త్యాలోనాఁ గనుపట్టె నట్టియెడ నందద్రాజహంసంబునాన్॥

౧౫

గీ॥ వరుఁడు కెంగేల నకల్హన్యచరణపుటము
సన్నికంటిపై నిడ నొప్పె శత్రుతరుపతి
చూడమాణిక్యములమీఁదఁ గూడఁజేయు
లీలఁ బ్రకటింపఁ బూనిన కేళి మెఱయ.

# ప్రశంసాపద్యములు.

(గతసంచికతరువాయి)

## ఆమోదప్రవేశిక.

శ్రీరమణీకటాక్షములఁ జెన్నలరారిన దివ్యసత్సుధా
ధారల నానినట్టి సుకృతంబు ఫలింపఁగ నాంధ్రపండితా
ధారము వాఙ్మయేందిర పదప్రసవార్చనచే మహోజ్జ్వలో
దారత మీఱె శ్రీప్రభలసంపతు లీభవనప్రతిష్ఠితిన్.

ఎందఱు లేరు ధారుణి నహీనధనాధిపులైనవారు, లే
కొందఱు గాని సత్కృతులకున్ ధనమున్ వ్యయము బొనర్ప; రా
కొందఱలోనఁ గొందఱగు కోవిదులే నిరవద్యభారతీ
సుందరపాదపూజలను శోభఁ దనర్చుట సత్య మద్దిరా!

3

భాషాసరస్వతీప్రాణప్రదములైన
తాళపత్త్రగ్రంథతతికి నెడ
విజ్ఞానసుగుణవివేకదాయకమైన
గ్రంథాలయమున కఖండగుప్తి
సరససుజ్ఞానవిషయకమహాసభా
సంధానమునకు విశాలవేది
సత్కావ్యభాషావిచారసమర్థమై
నట్టిపత్త్రికకుఁ గార్యాలయంబు
నైనభవనంబునకు వ్యయమైన ద్రవ్య
మొసఁగి యఖిలాంధ్ర పండిత ప్రసరమునకు
పరమ ముద మొదఁగూర్చిన ప్రభల సుంద
రాఖ్యసతి నిత్యసంస్తుత్య యగునుగాదె.

౪

ప్రభల వేంకటసుబ్బమాంబా! మహోజ్జ్వ
లంబయిన యాంధ్రసాహిత్యలక్ష్మి కొక్క
విమలసౌధంబు నొసఁగితి, విస్మరింప
లేము నీయుపకారము మామనముల.

౫

పరమంబైన ప్రశాంతిసౌఖ్యములు సంప్రాప్తించు; నీభర్త సుం
దరరామాఖ్యునకుం గరంబు పరిపత్త్రాణప్రదుండైన సో
దరుఁ డైనట్టి జయంతిరామయకు; నీదాతృత్వగాథావళుల్
తిరమై నిల్చిన వాంధ్రధారుణి నతంద్రీభూతసత్కీర్తితోన్.

కాకినాడ, 9-9-46.

ఇట్లు,
పాలెపు వేంకటరత్నము.

# ప్రశంసాపద్యములు.

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

చ. వనితలకెల్ల వన్నెయును వాసియుఁ గూర్చితివమ్మ ధర్మపుం
బనుల నొనర్చి, నీధనము భారతికిం గృహ మాచు నిల్చె, నీ
వనితరసాధ్యసత్ఫలము నంది చెరించితి, దీనఁ గీర్తియున్
వినఁబడు నెల్లకాలమును, వెంకటసుబ్బమ! ధన్యురాలవే? ౧

క. నీవలె సద్ధర్మంబులు
గావించెడి వనిత నేఁటికాలమునందున్
భావింపఁ గోటికొక్కమ
యీవసుధం గలుగఁ గళల కెంత తగు నొక్కో? ౨

ఉ. సుందరరామయార్యుని విశుద్ధచరిత్రుని ధర్మపత్నివై
నందులకున్, జయంతికులుఁడౌ నలరామయగారి చెల్లెలై

నందులకున్, సమర్థమగు నట్టిపనిం బచరించితమ్మ, నిన్
బొందక భర్తృసోదరులపుణ్యగుణంబులు పొల్లువోవునే ? ౪

గీ. ఆంధ్రసాహిత్యపరిషత్తు నన్నగారు
అగ్రెయింటను నిల్పినా రనుచు నెంచి
యన్న చేసినపనికిని వన్నెపెట్ట
శాంతభవనము గూర్చితే సుబ్బమాంబ ! ౪

ఉ వాసిగఁ బూర్వపుణ్యవిభవవ్యయలబ్ధధనంబు వన్నెయున్
వాసియుఁ గల్గ సద్వ్యయ మొనర్చితి, తావకభూతపూర్వసం
వాసితవాసనాబలము పావనమైనది, కాక దక్కనే
యీసరి సుప్రతిష్ఠ యిల నెవ్వరి కేనియు నెంతగల్గియున్. ౫

ఉ. దాతలచేతఁ బండితవిధాతలచేత, లసత్కిరీటమాం
ధాతలచేత నిల్పఁబడి నాఁటికి నేఁటికి నిల్వ నీడ లే
కే తపియించుసాహితికి నీవు ఘటించిన దివ్యసౌధ మ
త్యాతతకీర్తిఁగూర్చి మన యాంధ్రపురంధ్రులకీర్తి చాటెడిన్. ౬

ఉ. వేలకువే లొసంగితివి వేంకటనాథుని కాంధ్రవిశ్వవి
ద్యాలయసంస్థకన్నఁ, బరమార్థము దాన వచింపరాని, దీ
యాలయదాన మీపరిషదర్థము నీవొనరించు టిప్డు నేఁ
జాలను నాదువాక్కులను జాలవు చెప్ప నదెంతకృత్యమో ? ౭

గీ. తమ్ములపుటరుణిమ దోఁపఁ, దనదు మీస
ముఁ దెమల్చుచు రామయ్య ముద్దులొలుక
నవ్వుచున్నాఁడు లే; నీవొనర్చినట్టి
ధర్మకార్యము దలఁచి చిత్తమ్ములోన. ౮

సీ. నన్నపార్యుని పల్కునాడెంపు నిగ్గుతో
జనన మందిన యట్టి తెనుఁగుతల్లి
తిక్కనార్యుని పల్కుతీరుతో గడికట్టి
మనుగ డందిన యట్టి తెనుఁగుతల్లి

ఎఱ్ఱనార్యుని వాక్ప్రవృత్తితోఁ జెఱకువ
　　　తనము నందినయట్టి తెనుఁగుతల్లి
కవిరాజవాక్యమతార్థ రంపుఁ బసలతోఁ
　　　గుసిసి యాడినయట్టి తెనుఁగుతల్లి
గీ. పోతనమహాకవి యనిభక్తిబోధనములఁ
దేనెపలుకులు నేర్చిన తెనుఁగుతల్లి
ఆంధ్రపరిషదాకారము నంది నేఁడు
గేస్తురాలయ్యె ననుచు నగ్గింతు మఱని.

---

# ప్రశంసాపద్యములు.

శ్రీమత్తిరుమల పెద్దింటి రాఘవాచార్యులు.

సీ. ప్రాజ్ఞుఁడగు జయంతి రామయ్యపరమేష్ఠి
　　　సంకల్పసిద్ధిగా జననమంది
శ్రీసూర్యరాయేంద్రచిత్తడోలికయందుఁ
　　　బొత్తుల పాపవై హత్తియుండి
వీరేశలింగాదివిద్వద్వరేణ్య వా
　　　క్కులు నుగ్గుగాఁ గ్రోలి చెలువమంది
పోషకస్థాపక ప్రోద్ధారకార్థపు
　　　స్తన్యమున్ గ్రోలుచు ధన్యతగని
గీ. కిలకిలమనుచు నవ్వుచుఁ గేకరింత
వెట్టు చాట పాటల నేర్చి వివిధమంగ
ళముల వార్షికవిహరణన్ రక్తినొందు
నాంధ్రసాహిత్య జనని! దాసోఽహ మమ్మ! 1

గీ. సారసారస్వతవిమర్శసారమణులఁ
బూర్వకవిసూక్తిముక్తంపుఁబుంజములును

నాథు కసువర్ణ రచనావ్యాఘ్రనఖలుఁ
బడయు నీమెడఁ బలిగోటి పతకమహిమ. 2

గీ. రామయకు మానసికపుత్త్రి రామసోద
రీలసద్గృహపుత్త్రి కెంగేలు వట్టె
సూర్యరా ట్ప్రీతిని జూచి చొక్కుచుండె
దేహసంబంధ మెవరికి దీప్తి కాదు? 3

గీ. చెన్నపురి మనయాంధ్రుల కన్నబిడ్డ
కేంద్రమీస్థలి మాఱ్చక క్రీడసేయఁ
బలుక రేమి యాంధ్రులు మంటిపాము లగుచు
భాష రాష్ట్రవిభజనకు హేష గాదె? 4

గీ. అమ్మ! నీ నిబంధనములు వ్యాప్తిచేసి
చాలవఱకును సంపూర్తి సల్పి, తండు
సూర్యరాయని ఘంటువు శోభ దాల్చు
నీదుమంగళసూత్రతన్ నిజమునిజము. 5

శా. సాహిత్యాంబుధి నోలలాడు బలి యాసద్విక్రమాదిత్యుఁ డే
ర హిత్యంబును లేకయుండి రసమల్ రాజిల్లు నాంధ్రంబునన్
దా హాయిం గననోపు కావ్యతను సంస్థాపించి లోకంబుకున్
సాహాయ్యంబును జేసి కీర్తిసరసీసారంబునన్ వెల్గెడిన్. 6

గీ. తరుణసాహిత్య వృద్ధశంతనుకుమార
పరశురాములఁ బోలెడి పండితులకు
బుద్ధులను జూప భాషోద్ధ యుద్ధరంగ
మునఁ బడుచుఁదన మొందుదు ముద్దుగాను.

సీ. వివమించి మెఱయుత విక్రమదేవవా
గసిధార మనశత్రుహంత్రి యగుచు
తనరుచుండుత భువి దాఁగుడుమూఁతగా
సూర్యభూపాలు నౌదార్యకాంతి

తనపట్టుఁ గుండేటికిని గాల్లు మూఁడను
మూర్ఖులమనములు మఱుఁగుఁగాత
కాశిభట్టాదిసుఖ్యాతపండితసేవఁ
గనుఁ గాత వన్నెలఁ దెనుఁగుతల్లి

గీ. ప్రబల సుందరరామ ధర్మసతి సార్థ
కపు విరాళంపు సద్రూప గ్రంథగృహ మి
ది కడు వెలయుతఁ గీర్తిచంద్రికల దినదిన
ప్రవృద్ధశుద్ధశశిమై, నయమువిూఱ. 8

## ఆ శీః.

జంధ్యాల పాపయ్యశాస్త్రి.

శ్రీకరా స్సంతు సర్వేషాం సుధాకర సుధాకరాః
మహానట జటాజూట రంగ ద్గంగాంబుశీకరాః ॥

౨

ముదితం సుందరం భూయా దాంధ్రసాహిత్యసంసదః
గుంజితైః కంజభూ సుభ్రూమంజు మంజీర శింజితైః ॥

3

జయం త్యహో అహోరాత్రం 'జయంతి' భగినీ శ్రియః
వేణీషు కవిదారాణాం వాణీషుచ విపశ్చితామ్ ॥

# ప్రభల వేంకట సుబ్బమ్మగారి ప్రతివచనము.

చ. అలఘుచరిత్రులార, సముదంచితకీర్తిధురీణులార, వి
ద్దెలఁ బఠియించి మించినసుధీమణులార, హసింపఁబోక, నే
నెలమి వచించుపద్యములనెల్లవినన్ మిము వేఁడికొందు, న
ర్మిలి పఠియింపఁగా, సుతులు లే రితరుల్ మఱిలేకపోవుటన్.

ఉ. శ్రీలకుఁ దానకంబయిన చేడియతో మునులెల్ల గొల్వఁగా
నోలి జయావహంబగుచు నొప్పుమహానగరాధివాసుఁ డై
క్రాలు ముకుందుఁ డెల్లపుడు క్రమగణాంచితశ్రీయుతాత్మునిన్
పాలితపండితౌఘుని నృపాలకవిక్రమదేవు బ్రోచుతన్.

చ. విమలగుణోదయంబునను విద్యలనామమునన్ నృపాలతన్
అమలమతిన్ బుధాళిఁ గనునట్టి మహావిభవంబునందు వి
క్రముఁడగు భోజభూపతివిలాసము దోఁపఁగఁ జేయు నీయశం
బమర దిగంతమూచుఁ జెలువారెడు విక్రమదేవభూపతీ !

చ. కవిజనమాననీయమగు గౌరవ మొప్పఁగ భూపకోటిలో
నవిరళదానపాండితి నహర్నిశమున్ జెలువొంది విక్రమా
ఖ్యవెలయు నిన్ సదాజయపురాఖ్యసతీతిలకంబు భర్తగాఁ
దవిలి వరించి కీర్తిగనె తథ్యము విక్రమదేవభూపతీ !

గీ. దానదారాయుతం బయ్యె ధరణిలోన
కవికులాశ్రయహర మగుఁ గటికరంబు
దానధారాయుతంబయ్యె ధరణిలోన
కవికులాశ్రయ కరము నీకరము కరము.

సీ. కవితాప్రశస్తి నన్నయ తిక్కనాదులఁ
దలపించి వెలయు నుత్తముఁడ వీవ
విద్యానిధానత విక్రమభోజుల
దేవరాయల కీర్తిఁ దేలు దీవ

దానప్రశస్తి మాంధాతృత్రాది నృపతుల
గౌరవప్రఖ్యాతి గాంచి తీవ
ఆశ్రితత్రాణపరాయణాత్మత నెల్ల
వేళల హరికీర్తి వెలయు దీవ

గీ. అట్టి నీదుయశశ్చంద్రి కాఘువెపుడు
దిక్కులలముచు నెంతయుఁ దేజరిల్లఁ
బుడమి వర్ధిల్ల నాశీస్సు నిడెదఁ గొనుము
రాజదేవేంద్ర విక్రమరాజచంద్ర!

---

## కృతజ్ఞత.

ఉ. అండగ నెందఱో కువలయాధిపు లాశ్రితకల్పభూజు, లా
ఖండలతుల్యధాము లధికంబగు రొక్కము లిచ్చి యాంధ్ర భూ
మండలి నీదుపూజలు సమంచితరీతి నొనర్ప, పుణ్యముల్
పండుటగాదె నాకుఁ దగువాసము నీకిటు గూర్ప భారతీ!

ఉ. ఎందఱులేరు నీవడుగ నిచ్చెడిదాతలు, నాఁడుదాన నా
కెంమను శక్తిలేదు భవదీప్సితసిద్ధి నొనర్ప నైన నీ
సుందరరామసౌధమున శాంతముగా వసియింప మెచ్చికోల్
చెందితివమ్మ నాయలుచుసేవకు వందన మమ్మ భారతీ!

ఉ. చేసినసేవ చూడఁ గఱుఁ జిన్నది; వందనముల్ బుధాళికిన్
దోసము లెన్నియేని మదిఁ దోఁచుచునుండును వాని నన్నిటిన్
వీసము లెక్కసేయకుఁడు; వేడుక వాణిపదాబ్జసీమ నేఁ
జేసినపూజల స్వామలచిత్తముతోడ ననుగ్రహింపుఁడీ.

ఇట్లు.
ప్రభల వేంకటసుబ్బమ్మ.